# భారతదేశపు పరిశ్రమలు పంటలు

**సిమెంటుపరిశ్రమ**

ఈపరిశ్రమ పెద్దఎత్తుమీద భారతదేశంలో ౧౯౧౪ లో ప్రారంభమయ్యెను అప్పటినుండి వేగముగా వృద్ధిపొందినది. ఇప్పుడు ౨౦ కంపెనీలు పనిచేయుచున్నవి. అవి సంవత్సరము ౧ కి౧౦ లక్షలటన్నుల సిమెంటు తయారుచేయుచున్నవి భారతదేశపుసిమెంటు అనేకరకములలోతయారగును. ఇదిచాలా శ్రేష్ఠమైనదగుటచే బయటిదేశాలనుండి సిమెంటుదిగుమతులకు ఈదేశంలో చోటులేకుండాపోయినది. భారతదేశంలో చాక్లయిటుఅనుపదార్థము ఎక్కువగాదొరకును, దానిని ఉపయోగించిచేసినయెడల గట్టిపడిపోవుసిమెంటును తయారుచేయవీలగును, ఇప్పుడు అట్టిసిమెంటు ఎక్కువగాతయారుకావచ్చును. ఇంకను ప్రత్యేకరకముల సిమెంటులుచేయుటకు భారతదేశంలో ఎక్కువగానుండే మెగ్నెసైటులు ఎక్కువగాఉపయోగించగలవు.

**మైకా**

అభ్రకపురేకులఉత్పత్తియందు భారతదేశము ప్రపంచమందు అగ్రస్థానమువహించినట్టిది. ఈ అభ్రకము బీహారురాష్ట్రములో హజారీబాగు, గయాజిల్లాలలోను, మదరాసురాష్ట్రములో నెల్లూరులోను, మదరాసులోనుతక్కినజిల్లాలుకొద్దిగాను, టోంకుసంస్థానంలోను, రాజపుత్రస్థానంలో అజ్మీరు మెర్వారాలోను గనులనుండితీయబడును. భారతదేశపుఅభ్రకంలో ప్రతిశతి ౭౦ వంతులు బీహారులోను, తక్కినది నెల్లూరులోనుదొరకుచున్నది బీహారులోదొరకే "బెంగాలురుతీ" అనుఅభ్రకము చాలాశ్రేష్ఠమైనది, దీనిని ఆడవిజాతులవారు, విశేషముగాస్త్రీలు, మొదట ఇనుపకొడవళ్లతో చాలఅందముగా రేకులుగాతీర్చెదరు. అందువల్ల విదేశాలవారలుకూడ గనులలోనుండి తీసినఅభ్రకపుముద్దలను భారతదేశానికి పంపించిరేకులనుగాచేయించి తిరిగి తీసికొనిపోవుచున్నారు. భారతదేశములో అభ్రకమును ఎన్నిరూపంబులయిండ్లుగా అలంకారములకును, మందులకును వాడుచున్నారు.

**గ్లాసుపరిశ్రమ**

౧౯౧౪లోజరిగిన మహాసంగ్రామానికిపూర్వము భారతదేశంలో సంవత్సరం ౧కి ౭౦౦౦౦౦లు విలువగలగ్లాసుసామాను ఉత్పత్తి అయియుండెనని అంచనావేసియున్నారు.

౧౯౮౧లో రూ ౧౮౦౦౦౦౦౦ల విలువగల గ్లాసుసామాను ఉత్పత్తిఅయినట్లు టారిఫ్‌బోర్డువారు అంచనావేసినారు. ఇప్పుడుఎంతతక్కువగా అంచనావేసినను సంవత్సరము ౧కి దాదాపు రూ. ౨౦౦౦౦౦౦౦ల విలువగలగ్లాసుసామానుఉత్పత్తియగుచున్నది. ౧౯౧౪కుముందు మొత్తము భారతదేశానికి కావలసిన గ్లాసుసామానులో ౮౦ భాగముమాత్రమే ఈదేశంలో తయారగుచుండ, ఇప్పుడుకావలసినదానిలో సగముభాగము భారతదేశంలో నేతయారగుచున్నది.

**కాగితపు పరిశ్రమ**

వెదురునుంచి కాగితములనుచేసేగుజ్జు తయారుచేయుట భారతదేశమునకు ప్రత్యేకలక్షణము. ౧౯౨౫లో ౫౧౫౦౦౦ టన్నులవెదురు భారతదేశములో లభించునని అంచనావేయబడియుండెను. కానియిప్పుడు ౬౦౦౦౦ టన్నులకుపైగాదొరకుచున్నది. వెదురుకుతర్వాత గడ్డితో కాగితపుగుజ్జునుచేయుదురు. ఇందుకు సబాయిగడ్డిఅను దానిని వాడెదరు. ఇదిఎక్కువగా సంయుక్తరాష్ట్రములోను, బీహారులోను, ఒరిస్సాలోను, పంజాబులోనుగలదు.

**ప్రత్తిపంట**

భారతదేశంలో విక్రయానికై పండించేపంటలలో ప్రత్తిపంట చాలముఖ్యమైనది, ప్రపంచంలో ప్రత్తిపండించేదేశాలలో భారతదేశానికి రెండవస్థానము. ప్రతిఏటఇక్కడ ౩౦౦౦౪౦౦ పౌనులప్రత్తి పండించబడును అందులో దాదాపు సగము బయటికిపంపించబడును. దానివల్లరూ ౨౪౫౫ లక్షలమొదలుకొనిరూ ౩౭౦౪ లక్షలవరకువచ్చును.

**జనుము**

ప్రత్తితరువాత జనుముచాల ముఖ్యమైనపంట- ఇది బెంగాలు, అస్సాం, బీహారు, ఒరిస్సాలలో తప్ప మరిచటను ఎక్కువగాపండదు. మొత్తం ఈదేశంలోనిపంటలో నూటికి ౯౦ పాళ్ళు బెంగాలురాష్ట్రంలో పండును.

---

# మాలవ్యా పండితుని స్వాతంత్ర్య ప్రబోధము

మాలవ్యాపండితుడు ఇదివరలో గావించిన ప్రకటనప్రకారము కాశీలో సెప్టెంబరు౧౫వతేదిన టౌనుహాలులో గొప్పబహిరంగసభజరిగెను- పండిత మాలవ్యా గారుపన్యసించుచు "మనదేశము, మన రాజ్యము" ఉండవలెనని ప్రబోధించిరి- పూర్వపు మహాయుద్ధంలో భారతదేశమునుండి సైనికసహాయమునుపంపినపుడు బ్రిటిషు ప్రధానమంత్రియగు ఆస్క్విత్ గారు చెప్పినమాటలను వారు జ్ఞాపకముచేసిరి- మనమును (భారతీయులము) వారును (బ్రిటిషువారు) సకలప్రపంచసమానసౌభాగ్యము నకునుసంయుక్తముగ ధర్మకర్తలమని ఆస్క్విత్ గారనియుండిరి. ఆయుద్ధ విజయకీర్తిలో భారతీయులును భాగస్వాములని వారనియుండిరి- ప్రపంచములో స్వాతంత్ర్యపక్షమునకు కలిగిన జయములలో నెల్ల అది ఆశ్చర్యకరమైనదని చెప్పిరి-వారుచెప్పిన మాటలనుబట్టి భారతదేశమునకు స్వాతంత్ర్యమునిత్తురని తలంచితిమిగాని, అప్పటినుండి ఇప్పటికిఇరువదేండ్లయినను, ఆయాశలు సిద్ధించలేదని-మాలవ్యాగారుచెప్పిరి-ఇపుడుకూడ యుద్ధముప్రారంభమైన రెండేండ్లనుండికూడ భారతదేశముయొక్క సేనలు అనేక కేంద్రములయందలి విజయములకు సహాయముచేసినవనిరి. ఇందుకు ప్రతిఫలముగా భారతదేశము బ్రిటనుకులోబడిన దేశముగాక స్వతంత్రదేశమనియు, యుద్ధానంతరము భారతదేశమునకు బ్రిటనుహోదాతో సమానమగు హోదాఇవ్వబడుననియు ప్రకటించవలెనని భారతీయులు బ్రిటిషు ప్రభుత్వమును కోరుచున్నారు- కాని బ్రిటిషుప్రభుత్వము అధికారవిసర్జనకు నిశ్చయించుకొనలేదని కనిపించుచున్నదని వారుచెప్పిరి. తుదకు వారిట్లుచెప్పిరి: నాదేశీయులారా! చర్చిల్ గారుమిమ్ములను మోసపెట్టగోరుచున్న అంతస్థులో అణగియుండుటకు మీరు సంతృప్తులైయున్నారా! బ్రిటను అనుభవించుచున్నటువంటి స్వాతంత్ర్యము మీకుకావలయునా? మీకు అట్టిస్వాతంత్ర్యముకావలసినచో చర్చిల్ గారిప్రసంగములవల్ల విచారపడవద్దు-మీస్వాతంత్ర్యమును పొందుటకు మీరు సంసిద్ధులైయున్న చాలును,' మీలోమీరు ఐకమత్యముగలిగియున్న చాలును, మీరు చేయవలసిన త్యాగములకు మీరుసిద్ధపడిన చాలును- మీమనోభీష్టము నెరవేరగలదు-మంచితరుణ, దేశసేవాదీక్ష మీకుండవలెను-"

ఉపన్యాసానంతరము మాలవ్యాగారు ఇదివరలో సూచించియుండినటువంటి తీర్మానములు ఆమోదించబడినవి- ఆతీర్మానముల ప్రతియొకటి వైస్రాయి గారికి పంపబడినట్లు తెలియుచున్నది.

ఆతీర్మానాల ప్రతులలో ఒకటి బ్రిటిషు మంత్రివర్గమందు డిప్యూటీప్రధానమంత్రియగు సి-ఆర్ అట్లీగారికిని, వైకౌంట్ సేమ్యూయల్ మున్నగు పార్లమెంటు సభ్యుల కొకటియు పంపబడినట్లు తెలియుచున్నది-

---

**పూనా జిల్లాకాంగ్రెసుఅధ్యక్షుని రాజీనామా**

పూనాజిల్లా కాంగ్రెసుసంఘముయొక్క అధ్యక్షుడగు యన్-జి-గోరే గారు తానుఇప్పటిసత్యాగ్రహములో చేరలేననుచు సత్యాగ్రహుల పేరులపట్టికలోనుంచి తనపేరునుతొలగింపజేసి తనఅధ్యక్షస్థానమునకు రాజీనామానిచ్చినాడు.

---

## ఇండియాలో మోటారు పరిశ్రమ

బ్రిటిషువారి ఆటంకమునకు ఖండన

బొంబాయి, సెప్టెంబరు ౧౩

వాల్‌చంద్ హీరాచంద్ గారు యిట్లువిమర్శించినారు.

ఇండియా మోటారులు తయారుచేయడం యుద్ధసహాయకార్యములలో నొకటికాదన్నట్లుగా అమెరీగారు మాట్లాడుచున్నారు. విదేశ్లనుండి ఇండియాప్రభుత్వంవారికి యీమోటారుపరిశ్రమ ప్రణాళికను తెల్పుచుంటిని. యుద్ధంప్రారంభమయినతర్వాత యుద్ధానికి అవసరమయినట్లుగా పరిశ్రమమార్తునని, యుద్ధసహాయకార్యంగా దీనిని చూచుకొనవలెనని కోరితిమి. ఇండియాప్రభుత్వంవారు యీపరిశ్రమయొక్క తమవిధిని నిర్వర్తించుటమాని, తమఅశ్రద్ధను సమర్థించుకొనుటకుగాను, యీపరిశ్రమప్రారంభించుటకుయుద్ధమే ప్రతిబంధకమనుచున్నారు.

యుద్ధంప్రారంభంకాగానే 60000 మోటారులకు 9½ కోట్లరూప్యకల అర్డరు విదేశాలకుపోయినవి. ఇండియాలోపరిశ్రమవుంటే ఆలాభంఇండియాప్రజలకుండదా? క్రొత్తపరిశ్రమస్థాపించుటకు ప్రభుత్వంవారితోడ్పాటు అభిమానంఉన్నచో ఏడుమాసాలలు వ్యవధిచాలును. కనడా ఆస్ట్రేలియాలయొక్క ప్రభుత్వాలు తమప్రభుత్వాలతో ఏర్పాటుచేసుకొని క్రొత్తఇంజనీరింగు ఫ్యాక్టరీలను స్థాపించి విమానాలయంత్రాలుగూడ తయారుచేయించుచున్నవి. ఆస్ట్రేలియాలో ఇండియాలోనున్న అవకాశాలుగూడలేవు. బెంగుళూరు విమానాల ఫ్యాక్టరీలో ఏడెన్మిదినెలలు ఇండియాప్రభుత్వంతో రాయబారములుజరిపినపిమ్మట వివిధభాగాలను తెప్పించి విమానంగాజత చేసి తయారుచేయగల్గితిమి ఆస్ట్రేలియాప్రభుత్వంమోటారుఉత్పత్తికై ౧౫. లక్షలపౌనులు విరాళము ఇచ్చినంగా. ఇండియాప్రభుత్వంవారు ఏదోసాకుచెప్పి పరిశ్రమను అభివృద్ధి చెందకుండా నిరోధించుచున్నారు. ఈసాకులు విశ్వాసకులు విచారించిన నిలువవు. పెట్టుబడి ద్రవ్యము, కార్యనిర్వాహకులు, కార్మికులు ముడిపదార్థములు కొల్లగా యీదేశములో దొరుకుచున్నను పరిశ్రమ అభివృద్ధి చెందుటకు వీలులేకున్నది,

లండన్, సెప్టెంబర్ ౧౧

కామన్సు సభలో చార్లెస్ అమ్మన్ అను కార్మికసభ్యుడు ఇండియాలో మోటారుపరిశ్రమ స్థాపనకు ఇండియాప్రభుత్వము ఆటంకములు కలిగించినదనియు, అవసరమైన యంత్రములను విడుదల, అమెరికాలో సామగ్రి కొనుటకు డాలర్లుఇవ్వక చిక్కులుపెట్టినదనియుచెప్పి, అట్టిపరిశ్రమస్థాపన యుద్ధమునకు ముందు ఉపయోగము కాదాయని యడిగెను.

అమ్మన్ గారు చెప్పినమాటను అమెరీగారు ఒప్పుకొనలేదు- మోటారుపరిశ్రమ స్థాపిస్తే యుద్ధావసరములకు కావలసిన సంపత్తిని లాగుకొనును- ఇప్పుడు యుద్ధఉత్పత్తికి జరూరుగా కావలసిన కార్మికబలమును, సామగ్రిని తీసుకొనకపోతే ఎమియు ఆటంకముండదనిరి.

### సి. రాజగోపాలాచారిగారి చిత్రపటావిష్కరణ

పూర్వము మదరాసురాష్ట్రములో కాంగ్రెసుపార్టీ నాయకుడై ప్రధానమంత్రిగా నుండి ఇపుడు యుద్ధప్రతికూలసత్యాగ్రహముచేసి జైలులో శిక్షననుభవించుచున్న సి రాజగోపాలాచారి గారి తైలచిత్రపటమును ఆంధ్రచిత్రకారుడగు శ్రీయుత్ చేమకూర్ గారు రచించియుండిరి. దానిని సెప్టెంబరు౧౪వ తేది సాయంత్రము మదరాసులో త్యాగరాయనగరంలో హిందీప్రచారకసభావరణలో తిరువాన్కూరుదివాన్ సర్ సి. పి. రామస్వామయ్యరుగారు ఆవిష్కరణముచేసిరి. పలువురు ఉపన్యసించుచు రాజగోపాలాచారిగారి గుణములను మెచ్చుకొనిరి.

### ఒరిస్సాలో నూతనమంత్రివర్గ నిర్మాణపు కుట్రలు

ఒరిస్సారాష్ట్రంలో కొందరు కాంగ్రెసువారలు ఇతరపక్షాలవారలతోకలిసి మంత్రివర్గమును ఏర్పరచేప్రయత్నములోఉండి కుట్రలు చేయుచున్నట్లు ఒకవార్త తెలిసినది.

## "హిందూస్థాన్ టైమ్సు" పత్రికపై కోర్టుధిక్కారాభియోగము

"హిందూస్థాన్ టైమ్సు" పత్రికపై కోర్టుధిక్కారాభియోగమొకటి అలహాబాదు హైకోర్టులో ప్రధానన్యాయాధిపతి సర్ ఎక్బాల్ అహమ్మద్, న్యాII కోలిస్టర్ గారలసమక్షంలో విచారణచేయబడుచున్నది. ఈపత్రికయొక్క ౧౯౪౧ ఆగస్టు ౨వ తేదినాటి సంచికలో "అలహాబాదు హైకోర్టు క్రొత్తప్రధాన న్యాయాధిపతి సర్ ఎక్బాల్ అహమ్మదు గారు సంయుక్తరాష్ట్రములోని అన్ని న్యాయస్థానాలమీదను తనకుగల పరిపాలనాధికారముతో న్యాయశాఖాధికారులందరును యుద్ధనిధులకు ధనమును సమకూర్చవలెనను సర్క్యులరును పంపినమాటనిజమైనచో ప్రజలదృష్టిలో న్యాయస్థానముల ప్రతిష్ఠను తక్కువచేయుపనిని సర్ ఎక్బాల్ గారుచేసిరనవలసివచ్చును- ప్రభుత్వోద్యోగులుకానివారలును, ప్రజాసంఘములును యుద్ధనిధులకు ధనసహాయముచేయుటకిష్టమున్నప్రజలు ధనమొసగవలెననికోరవచ్చును. కానిఇట్లుప్రజలనుకోరుటకు ప్రభుత్వకార్యనిర్వాహకశాఖోద్యోగులను నియోగించుటయేతప్పుపని, ఇక న్యాయశాఖాధికారులను నియోగించుటమిక్కిలి గొప్పతప్పు అనుటకేమియుసందేహముతేదు-" అనువిమర్శప్రకటితమైనది. ఇట్టివిమర్శప్రకటించుటకు అంగీకరించినందువల్ల ఈపత్రికసంపాదకుడగు దేవదాస్ గాంధిగారు కోర్టుధిక్కారమను నేరముచేసినాడుఅని అభియోగములోనిఫిర్యాదు.

ఈఅభియోగమును సెప్టెంబరు ౧౫వ తేదిన విచారించినపుడు, దేవదాసు గాంధిగారు మోపిన నిందలలో చాలాభాగమునిజమైనవికావని తెలుపబడినందువల్ల మీరట్ అడిషనల్ సెషన్సు న్యాయాధిపతియగు హరిశంకర విద్యార్థిగారిని, జిల్లా జడ్జియగు అహమ్మదుహుసేన్ గారిని న్యాయస్థానంలో ప్రమాణముచేయించి సాక్ష్యముగైకొనిరి సంపాదకునిపక్షమున అయినవురిని సర్ తేజ్‌బహదర్ సప్రూగారు అడ్డుప్రశ్నలువేసి పరీక్షించిన తర్వాత, తక్కినవిచారణ సెప్టెంబరు ౨౪వ తేదినాటికి వాయిదావేయబడెను,

## సర్పద్వీపము

హిందూమహాసముద్రములో ఆఫ్రికా, ఆస్ట్రేలియాలమధ్య ఒక వలయద్వీపమున్నది. ప్రపంచములో మరెక్కడగాని యిచ్చటనున్న సర్పములు, సాలీళ్లు, తేళ్ళు మరెచ్చటనులేవని చెప్పవచ్చును- ఇచ్చటపాములు అరుమొందలు ఎనిమిదడుగులపొడవుపుండును. తెలుపు, ఎరుపు, నలుపువర్ణములసర్పములు లేకరకములుగలవు. ఇతరపాములవలె యివిమానవులనిజూడగ వాటినికదిల్చినఎదిరించిపోరాడునట.

ఇక్కడ దాచబడినదనుకొనుచున్న నిధి మొదటస్పెయిన్ దేశస్థులది. ఒకస్పెయిన్‌దేశపుఓడకు నిధిని తూర్పుయిండియా దీవులనుండి తీసుకొనిపోవుచుండగ మార్గమధ్యమున ఈవలయసర్పద్వీపసమీపమున తుపానువల్ల పడవ బ్రద్దలుకాగా ఆ నావికులునిధితోసహా ఈదీవిచేరినట్లును తరువాత ఈనావికులందరు సర్పములపాలైనట్లును అందువల్లవారినిధి యిచ్చటవున్నట్లు చెప్పబడుచున్నది.

తరుపరిఅనేకమంది ఈనిధినితెసుకుటకువెళ్లి ఆదీవిలోగల సర్పములకాటుకుఅనేకులు నిష్ఫలులైరి అట్లెలియుచున్నది. ఈనిధికై మరొకప్రయత్నం జరిపెదరని తీర్మానించివారు.

(J. B. S. Blity నుండి)

... ... ...

### ప్రపంచంలో పెద్దవంతెన

ప్రపంచంలోకెల్ల పెద్దదైనవంతెన గంగానదిమీద ఈస్టరన్ బెంగాల్ రైల్వేవారు కట్టిన "హార్డింగ్ వంతెన". ఇదిప్రపంచములోని పొడవువంతెనలలోనొకటి. దీనిపొడవు 5900 అడుగులు. దీనినిర్మాణముగొప్పయింజనీరింగు శాస్త్రముతోకూడినది. వారధిస్తంభములు 150 అడుగుల లోతుగల నూతులనుండి నిలుపబడినవి

(J. B. S 'హిందు' నుండి)

